The First Telugu Bi-weekly in Andhra Desa The only Telugu Newspaper for H E H The Nizam's Dominions

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును.

103355

సం॥ చందా రూ ౬-౦-౦
అర్ధ ,, ,, ౩-౧౨-౦
విడి ప్రతిక ౦ ౧ ౪

హైదరాబాదు, (దక్కన్)
GOLKONDA PATRIKA
HYDERABAD (Dn) WEDNESDAY 30 11 32

ఒకవారము తరువాత ప్రాతప్రతికి కోరినచో దాని వెలకు పరిమితి లేదు

సంపుటము ౬ } శా.శ. ౧౮౫౪ అంగీరస సం॥ మార్గశిర శు॥౩ బుధవారము ౩౦-౧౧-౧౯౩౨ ఫ॥ { సంచిక ౫౬

## అస్పృశ్యతా నివారణము

### గాంధిమహాత్ముని ౬ వ సందేశము

### కొన్ని ప్రశ్నలకు ప్రత్యుత్తరములు

నేనీ ప్రకటనలో ఉత్తరమొసగదలచిన ప్రశ్నలు పూర్వప్రకటనలయందే యిమిడియున్నవి అయినను, అవి మరల మరల యడుగబడుచుండుటచే, నేను వాటిలో సాధ్యమైనన్నింటిని ఒక్క ప్రకటనలో క్రోడీకరించి విమర్శించిన చక్కగా నుండునని తలంచితిని

„మీరు జనులను, వారికిష్టములేకున్నను, నిర్బంధించుచున్నారుగాదా?" అనునది అట్టి ప్రశ్నలలో నొకటి అయినను, అది నా భావముకాదు నేను చేయదలచిన ప్రాయోపవేశము దుర్బలులను బలవంతులజేయుటకును, సోమరులను చురుకుదనముగలవారిని జేయుటకును, అవిశ్వాసులకు విశ్వాసమును కల్గించుటకును ఉద్దిష్టమైనది కొంచెమాలోచించినచో సంస్కారణ ప్రతికూలురలో యీయుపవాసమే మార్పును కల్గింపకపోగా, వారిమట్టుకు వారీయుపవాసమునువిని సంతోషింపగలరని స్పష్టముగ తెలియగలదు కుపితుడైన నొకవిలేఖరి ఇట్లు స్పష్టముగా దెలుపుటకు సంకోచింపలేదు అయినను మరియొకవిలేఖరి యిటుల దెలుపుచున్నాడు, „మీ రాయాఫలితముల నుద్దేశింపలేదని చెప్పుట సరిగానేయున్నది అయినను అనేకులు పూర్వాచారపరాయణులు మీయనుచరులత్యుద్రేకపూరితులై బాధింతురను భయముతోనే జన సమూహమనుసరించుచున్నారు"

ఇటువంటి వాదమున్న యూహించిన ఎటువంటి సమయమందైనను చేయవచ్చును ఏ ఉపవాసము అవసరము లేక ఎన్నియో యుద్యమములను నేను నా జీవితమునందు నడిపియున్నాను అయినను నానిశ్చయమునుండి నన్ను తొలగించుటకు నేనిప్పుడు జవాబిచ్చుప్రశ్న యే అనేక పర్యాయములు వేయబడినది నేనుచేయదలచిన యుపవాసమునకు ఎట్టిఫలితముల నైనను యుద్దేశములను దలంతును గాక నాయాత్మగౌరవపు మాటనటుంచి నన్ను నమ్మిన జనులు వేలకొలది గొప్పయుద్యమములకు పూనుకొనుటకు అది తప్పక పురిగొల్పునను కారణము మరి యొకటి యున్నపుడు నే నాయుపవాస దీక్షను పూనవలెను మత సంబంధమగు ప్రబల యుద్యమమందున్న అట్లేయగును.

„మీరు హిందువులలో ఒకరిపైనొకరికి విరోధమును లేపుటలేదా?" అనునది రెండవప్రశ్న అట్లు కానేకాదు ప్రతి సంస్కారణమందును కొద్దివిరోధము తప్పక సంభవించును అయినను కొంతవరకుమాత్రము ప్రాపకాల్యమున్న, ఆందోళనయున్న మంచి యభివృద్ధికి సూచనలు సంస్కర్తలకును సనాతనులకును శాశ్వత భేదభావ మేర్పడునను భయము నాకు లేదు సనాతనుల విరోధమును తృణీకరించుటగాని వారిభావమును ఉపేక్షించుటగాని నాతలపునకు దూరముగనుండుగాక వారిలో కొందరు సనాతనధర్మమపాయదశయందున్నదని నమ్ముచున్నారనుమాటను నేను సందేహింపను అయినప్పటికిని, సనాతనసంస్కర్తల భేదము అధమపక్షము ఊహాయందైనను, యెంతో తక్కువగా నుండుట ఆశ్చర్యకరము

నాకు సనాతనులు వ్రాసిన ప్రతిజ్ఞాపత్రమున్న వారీక్రిందివిషయముల కంగీకరించుట వింత (౧) హరిజనుల స్థితిని చక్కబరుచుటకు చేయవలసినపని యెంతో యున్నదని మే మొప్పుకొనెదము (౨) అనేకులు సవర్ణహిందువులు హరిజనులను సరిగాజూచుటలేదని మే మొప్పుకొనెదము (౩) వారి బిడ్డలకువిద్యయు వారికి నివసించుటకు మంచియిండ్లును నుండవలెనని మే మొప్పుకొందుము (౪) వారు స్నానము చేయుటకును వాడుకకు నీరు దెచ్చుకొనుటకు తగినయేర్పాటులుండవలెనని మే మొప్పుకొందుము (౫) వారికి రాజ్యపాలనకు సంబంధించిన హక్కులు పూర్తిగా నుండవలెనని మే మొప్పుకొందుము (౬) వారు దేవుని పూజించుటకు తగియున్న అనుకూలము లుండవలెననియు మే మొప్పుకొందుము (౭) ఇతరులకుండు పౌరసత్వపుహక్కులు వారికిని యుండవలెనని మే మంగీకరింతుము, అయితే వారిని తాకవలెననిగాని ముఖ్యముగా యిప్పటివంటి స్థితిలోయున్నంతకాలము వారితో కలిసిమెలిసి తిరుగవలెననిగాని మమ్ముల నిర్బంధింపగూడదు

వారిని మీతో సమానులనుగ జేయు అవసరమును మీ రంగీకరింతురు గనుక, యితర సవర్ణ హిందువులు యింకొక అడుగు ముందుకువేసిన మీరందరు కొందొకలితు లయ్యెదరని నా ప్రశ్న మీరు నమ్మిన శాస్త్రముల ప్రమాణమును బట్టియే నాస్తు హరిజనుల నస్పృశ్యులనుగ భావించుట తమకు ధర్మము కాదనియు మీరిచ్చట కొప్పుకొను హక్కులయందు తమతోపాటు హరిజనులనుకూడ భాగస్థులజేయుట తమ ధర్మమనియు వారు నమ్ముచున్నారు మీరుమాత్రము మీతో కలియకుండ హరిజనులు ఆహక్కుల ననుభవింపవలెనని కోరుచున్నారు మీకుదోచినటుల మీరుచేయుటకు వీలుండవలెను గాని యితరుల నిర్బంధమును మీరువేసికొనుట సరియే ఇప్పుడున్నప్పుడు మీరు అవసరమని తలంచు మనుష్య నివారణోపాయములను మీకిష్టమగు విధమున నే సంస్కర్తలును అవలంబింపవలెనని నిర్బంధముండుట మీకిష్టమేనా?

నేనింతకంటె మంచిపద్ధతిని చూపించుటకు సాహసించుచున్నాను హరిజనులదశ చక్కబరచవలసి యున్నదని మీరు సంస్కర్తలతోబాటు ఒప్పుకొందురు గనుకను అందుకింతవరకు మీరేమియు చేయలేదు గనుకను, యిప్పుడు వారు వసూలుచేయు డబ్బును మీరు ఔదార్యముతో తోడ్పడి వారు హిందూమతమునకిచ్చు అర్థమును మీరిచ్చు అర్థమును వలెనే గౌరవించి వారిని మీరు బలముగ పనిచేయనిండు. ఇంతవరకును సంస్కర్తలు హరిజనులతో కలియుచున్నను మీకేయభ్యంతరము లేకపోయెను వారియిచ్చవచ్చిన త్రోవను వారిని పోనిచ్చితిరి వారిని బహిష్కరింపలేదు ఇప్పుడు ఉద్యమము మరింత చురుకుగా వ్యాప్తి చెందుచున్నంత మాత్రమున మీ రెదిరించుట నిరర్థకము

అయినను ఒకకష్టమింకను అడ్డగించుచున్నది ఇప్పుడు కొన్ని పబ్లికు దేవాలయములును ప్రజాహిత సంస్థలు ఉన్నవి వాటిలోకి హరిజనుల ప్రవేశము లేదు కొన్ని సందర్భములయందీ నిరాకరణమునకు చట్టము అనుకూలించుచున్నది అయితేచాలా కొల్ల చట్టమింకను ప్రతికూలముగానే యున్నది ఈ దేవాలయములను సంస్థను ఎవరు ప్రయోగింపవలెను ఈ చిక్కునుండి తప్పించుకొనుటకు చిన్నయుపాయమొకటి గలదు ప్రతిపక్షము వారు కోపమును త్యజించి ఒకరియెడల నొకరు గౌరవముచూపుదురేని ఈ విషయమున ప్రత్యేకగ్రామవాసుని యొక్కయు ప్రతి నగరవాసుని యొక్కయు అభిప్రాయమును సులభముగా కనుగొనవచ్చును ఈ సందర్భమున

ఒక్కొక్కపట్టణము వేరుగానైనగాని రెండుమూడు పట్టణములు కలిపి ఒకటిగానైనగాని గ్రహింపవచ్చును. అట్లే ఒక పట్టణమునే అనేకభాగములనుగా జేయవచ్చును ఇట్లు జరిగినతరువాత ఏపక్షమువారికి అధిక సంఖ్యాకులు అనుకూలురుగ నుందురో ఆపక్షమువారు పబ్లిక్కు బావులను దేవాలయములను ఉపయోగింపవలెను సనాతనుల పక్షము గెల్చినప్పుడు, సంస్కర్తలకును అస్పృశ్యులకును సమానమగు ఉపయోగములను కల్పించుటకగు ఖర్చులను సంస్కర్తలతో బాటు తామును పంచుకొనవలెను

నేను సంస్కర్తలను హరిజనులతోడ జేర్చుచున్నాను కారణమేమనగా కొలమునడుచుకోలది వారు యంత్రీకరణములకులోబడి ప్రవర్తించునప్పుడు హరిజనులు సవర్ణులతో సరిసమానముగా అనుభవింపజాలని లాభములను తాముకూడ నిరాకరించుట విధియగును

ఈయుక్తిని బట్టి చూచినచో హరిజన సంస్కర్తలకు అత్మతుల్యములగు లాభముల గలుగజేయుటకు ఖర్చునంతయు న్యాయముగా సనాతనులే భరింపవలయునని తెలియగలదు ఎట్లన, హరిజనులకు తమతో తుల్యముగా ఉపయోగముల ననుభవించుటకు హక్కున్నదనియు, ఆహక్కు ఇంతవరకు వారికి నిరాకరింపబడెననియు సనాతనులు ఒప్పుకొన్నట్టుల నావచ్చిన జాబులలో అర్థమగుచున్నది నిజముగా అసత్తులగు పరిస్థితుల నూహించి సనాతనులు తమ బాధ్యతనుండి పారిపోనంగురు గాక

ఎఱ్ఱవాడ యొడంబడికి ననుసరించిగాని, ఈమధ్యనే స్థాపితమైన యఖిలభారత అస్పృశ్యతా నివారణ సంఘముచేసిన ప్రకటననుబట్టిగాని అస్పృశ్యతా నిర్మూలనమునందు నేను చెప్పినదానికంటె యెక్కువచేరదు సహపంక్తిభోజనము అంతర్వివాహ పద్ధతియందులో చేరదు నేనును పరియానెవరును హిందువులను యింతకంటె యెక్కువ కోరుటలేదని సనాతనులు భయపడవలసిన పనిలేదు వారు వ్యక్తుల యభిప్రాయమును, ఆచరణను నిరోధింప గోరుటలేదు తాము నమ్మినదానియందు వారికి దృఢనిశ్చయ మున్నచో నుండేమోవచ్చునని భయపడ బనిలేదు ఒకసంస్కరణము దానంతట అది ఎవరి సహాయములేకయు బలవంతమై యుండి కాలానుగుణముగా వచ్చినదైనచో, ఈలోకమందెంతటి శక్తియైనను దానిని నిరోధింపజాలదు

"సాంఘిక మత విషయములయందు మీ యభిప్రాయములమీదికి ప్రజలదృష్టి నాకర్షించి వాటిని ఒప్పుకొనుటకు తుపానువంటి యాందోళనను లేవదీయుటచేత మీరు రాజకీయ స్వాతంత్ర్యమునకు భంగము కల్గించుటలేదా" అనునది మూడవప్రశ్న.

నేను నైదీని అస్పృశ్యతా ప్రతిఘటన ప్రచారమును జరుపుటకుమాత్రము నేను కొన్ని నిర్బంధములకు లోబడియున్నాను ఆహద్దులను మీరకుండ యీప్రశ్నకు నేను వివరముగా జవాబీయజాలను అయినను యింతమట్టుకు మాత్రము నేను చెప్పగలను నన్నెరిగినవారందరికిని నేను రాజకీయ సాంఘిక మత విషయములు ఒకదానితో నొకటి యేమాత్రము సంబంధము లేవని తలచనని యెరిగియుండవలెను అవి యొకదానిపై నొకటి ఆధారపడి యుండుననియు వాటిలో ఒకదాని సమస్యను పరిష్కరించినచో తక్కినవాటి సమస్యలును చాలమట్టుకు పరిష్కరింపబడినవగు ననియు నేనెప్పుడును నమ్మియున్నాను నాకు వచ్చిన లేఖలలోని ప్రశ్నలన్నింటికి ఇదిపూర్తి జవాబుగాదు, నాకందు కొద్ది సహాయముతో ఆశేఖల నన్నింటిని నేను పరిశీలింపజాలను మిగిలినవాటిని నాచేతనైనంతమట్టుకు యీసారి ప్రకటనలో పరిశీలించెదను

లేఖకులు కొంచెము కరుణగల్గి యుండవలెను. ఇంతవరకును నేనెంతో మర్యాదతో నాకు వచ్చిన ప్రశ్నజాబును గ్రహించినాను, అయితే యికమీదట వారు నేను క్రమముగా ప్రకటనలలో వెలువరు జవాబులతో మాత్రము తృప్తి పొందుచు, దయచేసి వారు సొంతముగా యేమైనను జెప్ప దలచియున్నప్పుడుగాని, ప్రస్తుతోద్యమ సందర్భమున యేయంశమును గురించిగాని వారు స్వాభిప్రాయ మేర్పడుటకు ముందు నాజవాబును తెలిసికొనగోరినపుడు గాని మాత్రమే నాకు జాబు వ్రాయవలెను. అదిన్ని చాలా మట్టుసముగా నుండవలెను

---



---

# వివిధవార్తలు

## స్టేటుకౌన్సిలుకు అనధికారాధ్యక్షుడు

ఒక ప్రకటన గవర్నరు జనరలుగారు యిండియాలో ఈ రెండవ శాసనసభయగు స్టేటుకౌన్సిలుకు సర్ హెన్రీమాంక్రీఫుగారి స్థానమందు సర్ మేనెక్జీ దాదాభాయిగారిని, ప్రభుత్వమునందు అధికారము లేనివారిని, అధ్యక్షునిగా నియమించినటుల దెల్పుచున్నది

## కాన్వొకేషను పెండాలుకూలుట

లక్నో విశ్వవిద్యాలయమువారు పట్టప్రదానోత్సవము సల్పుటకై గొప్పపెండాలును నిర్మించి ఎంతో చక్కగా అలంకరించి యుండిరి అది ౨౫ వ తేదిరాత్రి మంటలలో బూడిదయ్యెను. పోలీసువారందరు కాపలా కాచుచుండ ఇందుకు కారకు లెవరో ఆశ్చర్యముగ నున్నది ఇప్పుడు పట్టప్రదానోత్సవమును విశ్వవిద్యాలయ భవనమందు జరుపుదురు

## హోరుగారి సంతృప్తి

„ ఇండియావిషయమై ఒక సంవత్సరము నకు ముందుకంటె యిప్పుడు ఎంతో బాగైనది లా అర్డరు చాలామట్టుకు ... ఇండియాయొక్క ఆర్థికపటుత్వము ... ముందుకంటె యిప్పుడు ఎక్కువ విశ్వాసజనకమైనది„ అని హోరుగారు లండనులో ఉపన్యసించుచు జెప్పిరి ప్రభుత్వమువారు లాఆర్డరును స్థాపించుటయు, అతిజాగ్రత్తతో రాజ్యాంగసంస్కరణము లవిషయమున ప్రవర్తించుటయు అను రెండుపద్ధతులపై తమకార్యముల నిర్వర్తించుచున్నారని దెల్పిరి.

---

ఇండియన్ మర్చెంట్సు చేంబరు సెక్రెటరీగారు ఇతర దేశవస్తువుల ప్రాకమగుపోటీని లేకుండచేయుటకు గట్టిచర్య దీసికొనవలెనని యిండియా ప్రభుత్వముయొక్క వాణిజ్య సభ్యునికి సూచించిరి

---

మదరాసు కరెన్సీఆఫీసులో గుమాస్తాగా పనిచేయుచున్న పి. ఏ పిళ్లెఅనునతడు ౩౦౦౦౦రూపాయలు కరెన్సీనోట్లను తీసికొని పరుగెత్తిపోయెనని అనుకొనుచుండగా అతడిప్పుడు చిత్తూరులో అరెస్టుచేయబడినాడు ౨౮౦౦౦ కరెన్సీ నోట్లుమాత్రము అతనివద్ద దొరకినవి

---

పండిత మదనమోహన మాలవ్యాగారు నవంబరు ౨౩వ తేదినాడు కలకత్తా గవర్నరుగారితో ఒకగంటసేపు ప్రసంగము చ్చటించిరి.

---

మౌలానా షౌకతాలీగారు భార్యతోటి నవంబరు ౨౩ వ తేదినాడు న్యూయార్కు ప్రయాణమైరి అచట మూడునెలలు ఉపన్యాసములిచ్చినతరువాత దూరప్రాచ్యదేశముల మార్గమున యిండియాకు వచ్చెదరు

---

రాజప్రతినిధిగారును విలింగ్డనుపత్నిగారు ఇంపీరియలు ఢిల్లీ జింఖానాక్లబ్బు కమిటీవారితోగూడ విందారగించి వారిని గౌరవించిరి

---

క్రిస్మసురోజున మద్యాహ్నము చక్రవర్తిగారు సంగ్రాంథము లోకమప్రజలతో హృదయములు హృదయములు కలియునాక్కుల నొసగెదరు బ్రిటిషుబ్రాడ్కాస్టింగుకంపెనీవారు ఆవాక్కులను పలుచోట్లకు వినిపింపమేర్పాటులు జేసెదరు. బ్రిటిషుప్రభువుగారిట్లు ప్రజలతో మాట్లాడుటకిది మొదటిసారి

---

మధ్యరాష్ట్రములకు అక్టింగుగవర్నరుగానుండిన సర్ ఆర్థర్ నెల్సనుగారు ౨౫ తేది సాయంత్రము బొంబాయి లెక్కపోయెదరు సర్ మాంటాగు బట్లరుగారు మరల విమానములో నాగపూరుకు వచ్చివారు గవర్నరుపనిని స్వీకరింతురు

---

గవర్నమెంటుప్రెస్సు ఉద్యోగుల సంఘమువారు నెల్సనుగారికి ఒక వెండిగిన్నెను బహుమతి నొసగిరి గవర్నరుగారు అగిన్నె సదరు సంఘమునందు మంచిఆటకొనికి తన స్మృత్యర్థమై యివ్వవలెనని తిరిగి సంఘమునకే యిచ్చివేసెను

---

## గాంధిగారిని విడిపింపరు

### వార్తాపత్రికల పుకారును అధికారులు అసత్యమనుట

క్రొత్తఢిల్లీ నవంబరు ౨౪ — లాంకీ ప్రభుగారి యొుత్తిడివలన సర్ శేమ్యూయల్ హోరుగారు గాంధిని వదలుట కొప్పుకొనిరనియు, బ్రిటిషు మంత్రి వర్గమువారి సలహాప్రకారము అందుకు ఇండియా ప్రభుత్వము వారుగూడ అనుకూలముగ నున్నారనియు ఫ్రీప్రెస్సువారు వ్యాపింపజేసిన వార్తయందు సత్యములేదని ప్రమాణములగువారొట్ల విచారింపగా తెలియుచున్నది. పోయిన ఏప్రిలునెల ౨౯ వ తేదినాడు గాంధిగారి రొమేలకు వారిశాసనోల్లంఘనోద్యమము పట్లను ఇండియా మంత్రిగారు నియమించినట్టియు, తరువాత పలుమారులు యిండియాలోను ఇంగ్లండులోను అనేక ప్రకటనలో పునరుచ్చారితమైనట్టియు పద్ధతి మార్చబడినదని చెప్పుటకు నిమిత్తమేదియు లేదు

(అ ప్రె)

---

## గురువయ్యూరు దేవాలయ ప్రవేశసమస్య

### గాంధిగారు ప్రజాభిప్రాయము గోరుట

పూనా, నవంబరు ౨౩ —

గురువయ్యూరు దేవాలయ ప్రవేశమును ప్రజాభిప్రాయమునకు సమర్పింప వలెను. అదియందుకు ప్రతికూలమైనచో నేనుపవాసము మానెదను. నాకు వచ్చిన వార్తయంతయు ప్రజాభిప్రాయము ప్రవేశాను కూలమని దెల్పుచున్నది. మధ్యస్థ సంఘమందు నేను పేరుకొన్న వారొకరు ను సనాతను లేరుకొన్న వారొకరును యుందురు. తీర్మానము మిద్దరిని బంధించును. అనిగాంధిగారు, అసోసియేటెడు ప్రెస్సువారికి దెల్పిరి.

## బొంబాయి శాసనసభ

### అర్డినెన్సుబిల్లు మొదటిసారికి సమ్మతిబడయుట

బొంబాయి శాసనసభలో అర్డినెన్సుబిల్లునుగూర్చి చర్చముగిసినతరువాత నవంబరు ౨౩ వ తేదినాడు ఓట్లు గ్రహింపబడెను ౬౭ మంది అనుకూలురును ౨౬ మంది ప్రతికూలురును అయిరి ఇట్లు మొదటసారికి బిల్లు సమ్మతింపబడెను

హోంమెంబరు కాంగ్రెసువారి యుద్యమము యిప్పటికిని మంచి విజృంభణతోనే యున్నదని ఒప్పుకొనిరి ఈ బిల్లువలన ప్రభుత్వమువారు విశేషాధికారములనుపొందిరిగాకెం లో యీదేశమందుండిన పరిస్థితులు మరల రాకుండ జేసెదమనిరి

బిల్లును అనుకూలముగా మాట్లాడిన అనధికారసభ్యులు అనేకకారణములను జెప్పిరి. కాంగ్రెసువారంటీల్లు బహిష్కారమును దానిని ప్రయోగించి వ్యాపారమునకును అల్పసంఖ్యాకులకును అనేకములగు చిక్కులను కలిగించుచున్నారనిరి శాసనోల్లంఘనోద్యమమువల్ల అనేకుల జీవనోపాయమునకు భంగము కలిగినదనిరి ఒక మహమ్మదీయసభ్యుడు కాంగ్రెసువారు వ్యక్తిస్వాతంత్ర్యమును నిర్బంధించుచున్నారని మొరపెట్టెను

వెంటనే మరియొక మహమ్మదీయసభ్యుడు లేచి అవిశేషాధికారములచే యిప్పటి గందరగోళమును పోగొట్ట సాధ్యము కాదనియు, దానికి మూలకారణములగు నిరుద్యోగసమస్య మరియుదారిద్ర్యము అను రోగములను నిర్మూలింపవలెననియు జైళ్లకువెళ్లిన ౬౦౦౦౦ మంది కాంగ్రెసువారిలో యిప్పటికే ౧౨౦౦౦ మంది ముసల్మానులుగలరనియు, సింధువిభజనము గావింపనిచో ఆనేతలు సింధు మహమ్మదీయులుకూడ కాంగ్రెసువారితో జేరి వేలకొలదిగ జైళ్లను నింపెదరనియుచెప్పెను

బిల్లును ప్రతికూలముగా వాదించిన యితరులు ప్రభుత్వమునకు విశేషాధికారమిచ్చినచో దానిని దుర్వినియోగము చేయుదురనియు ఇంతకుముందు అర్డినెన్సులిచ్చిన యధికారములనే ఎయుబడెననియు అయధికారములు వ్యక్తిస్వాతంత్ర్యమును నిరోధించుటకు వాడబడెననియు వాదించిరి

హోంమెంబరుగారు ఒక్క సవరణజేసిరి. దీనిప్రకారము బిల్లు ౧ సంవత్సరకాలముండును అప్పటికిని తొలగించినచో గవర్నరుగజెటులో ప్రకటించిరిగి రెండు సంవత్సరములవరకు అమలులోపెట్టుట కధికారము గల్గియుండును.

---

# శ్రీశైల జీర్ణోద్ధారనిధి

## బహుమతులు పంచిపెట్టబడును

ఒక రూపాయ మాత్రమే! చందా ధనము ఒక రూపాయమాత్రమే!!!

౨,౦౦,౦౦౦ చందాదారులు చేరిన తోడనే ప్రతి చందాదారునకు

ఛాయాపట సహిత శ్రీశైలచరిత్రము బహుమానము

రు. ౮౦,౦౦౦ ల మొత్తమునకు బహుమానము లొసగబడును

### బహుమానముల వివరము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ వ బహుమానము | రు ౨౫,౦౦౦ | | రు, ౧౦౦౦ | బహుమానము | ౩ |
| ౨ వ | ,, | ,, ౨౦,౦౦౦ | ,, ౫౦౦ | ,, | ౪ |
| ౩ వ,, | ,, | ,, ౧౦, ౦౦౦ | ,, ౨౫౦ | ,, | ౮ |
| ౪ వ | ,, | ,, ౫, ౦౦౦ | ,, ౨౦౦ | ,, | ౧౬ |
| ౫ వ | ,, | ,, ౩ ౦౦౦ | ,, ౧౦౦ | ,, | ౧౬ |
| | | | ,, ౫౦ | ,, | ౩౨ |
| | | | ,, ౨౫ | ,, | ౧౪౪ |

చేరిన మొత్తము, ననుసరించి బహుమతుల మొత్తములుసంఖ్యలు హెచ్చు తగ్గులు చేయబడును టికెట్లు గ్రూపులుగాను నమ్మబడును ప్రతి గ్రూపులోను ఏ బి సి డి. యి అను గుర్తులుగల ఒంటి టికెట్లు ౫ వుండును ఒక రూపాయ వెలగల ఒంటి టికెటునకు ఛాయాపట సహిత శ్రీశైల చరిత్రాంశము ఇయ్యబడును ప్రతి గ్రూపులో ౫ ఒంటి టికెట్లున్నందున గ్రూపు టికెటునకు రాబడు బహుమానము ౫ ఒంటి టికెట్లకు పంచిపెట్టబడును

రాబడు నిలువ మొత్తమును శ్రీశైలము హాటకేశ్వరము, శిఖరేశ్వరము నందుండు గోపుర మంటపముల జీర్ణోద్ధారమునకును, వీటి సౌకర్యములకును, మార్గముల అభివృద్ధికిని, వాహనములు చేయించుటకును ఉపయోగింప బడును, టికెట్లు వలయువారు క్రింది చిరునామాలకు వ్రాయుడు

గోలకొండ పత్రికాలయము,
హైదరాబాదు దక్కన్.

లేక పాణ్యం రామయ్య వకీలు,
అధ్యక్షుడు శ్రీశైల పరిపాలన సంఘము,
కోవెల కుంట్ల. కర్నూలుజిల్లా.

## అటావా కమిటీ నివేదికపై చేవ్రాలు జేసినారు

### ప్రతికూలుర యభిప్రాయములు ప్రత్యేకముగ జేర్చబడును.

అటావా కమిటీవారు సాక్ష్యములను ముగించి, నివేదికను పూర్తి చేసి ౨౩ వ తేదినాడు నివేదికపై తమ చేవ్రాలు పెట్టినారు ఈ నివేదిక ప్రకారము, మొదటినుండియే యూహింపబడుచున్నటుల, అటావా యొడంబడికను ౩ సంవత్సరముల కాలముంచుటకు శిఫారసు చేయబడినది ఈ మూడు సంవత్సరములున్ను ౧౫ మంది అసెంబ్లీ సభ్యులుగల యొక సంఘము యుండియీయొడంబడికయు జరుగుచు అటావా ఒడంబడికవల్ల కలుగు లాభనష్టములను గమనించి ప్రతిసంవత్సరము అసెంబ్లీవారికి నివేదింపవలెను మూడేండ్ల తరువాత అసెంబ్లీలో ఆమోదింపబడిన తీర్మానము ఒడంబడికను రద్దు చేయుటకు చాలును వైస్రాయి గారి యామోద మక్కరలేదు

మొదట ఒడంబడికకు ప్రతికూలముగా శాసనసభలో వాదించిన హరిసింగు గౌరుగారు యీసూచన గావించిరి మొదట ప్రతికూలముగానే యుండిన మోడీగారును ఈ సూచన నంగీకరించిరి.

ఎట్లయిననేమి యిపుడు ముగ్గురు మాత్రమే ఒడంబడికకు ప్రతికూలముగ నున్నారు శ్రీసీతారామరాజు హరవిలాసశారదా, అబ్దుల్ రహీంగారలు తమ ప్రాతికూల్యమును చెప్పు ప్రత్యేకనివేదికల నేర్పరచినారు ఈ నివేదికలన్నియు ౨౫ వ తేదినాడు అసెంబ్లీలో సమర్పింపబడును

---

## సేనుగుప్త సుభాసుబోసుగార్ల జబ్బు

### బెంగాలు శాసనసభలో అడ్జరన్మెంటు

ఇప్పుడు రాజకీయ ఖైదీలుగా శిక్ష ననుభవించుచున్న సేనుగుప్త సుభాసుబోసు గార్ల యారోగ్యస్థితి అతివిషాదకరముగ స్థితిలోనున్నది గనుక దానినిగురించి అత్యవసరముగా విచారింపవలెనని బెంగాలు శాసనసభయందు శ్యామప్రసాదు గారు ఒక అడ్జరన్మెంటును ప్రతిపాదించిరి

వారికి జైలులో మంచి చికిత్స లభించనిచో వారిని విడిచిపెట్టుటయో, వారికి మంచి యారోగ్యము కలుగగల స్థలమునకు వారుబోవుటకు యేర్పాటుల గావించుటయో చేయవలెనని వారుచెప్పిరి

తరువాత మహమ్మదీయుల పక్షమున ఫజులుహఖుగారు ఉపన్యసించిరి ప్రజాభిప్రాయైకమత్యము యొక్క విలువను గ్రహించి బెంగాలు ప్రభుత్వమువారును, ఇండియా ప్రభుత్వమును సేనుగుప్తబోసుల గార్లకు చేయవలసిన సహాయమునంతయు చేయవలెననిరి

హోం మెంబరుగారు జవాబిచ్చుచు వారి యారోగ్యమును గాపాడుటకు ప్రతిప్రయత్నము చేయబడుచున్నదనెను

సాయంకాలము ౬ గంటలకు చర్చించుటకు శాసనసభవారనుమతి యొసగిరి అనధికారసభ్యులు హిందువులును మహమ్మదీయులును ఏకమై తీర్మానముపక్షమున వాదించిరి

---

కనడాలో ప్రభుత్వమువారు ౮ కోట్ల డాలర్లు అప్పుగావలెనని ప్రకటించియుండ అంతకుపైగానే ప్రజలు అప్పుల నిచ్చినారు

---

## పండిత గోవింద మాలవ్యా గారి ప్రకటన

### ఐకమత్య సభయొక్క ఉపసంఘము

### డిసెంబరు ౧౦ వ తేదినాడు సమావేశమగును

### ఐకమత్యసభ ౧౧, ౧౨ తేదీలనాడు

### సర్వపక్షసభ ౧౩ వ తేదీనాడు అలహాబాదులో సమావేశము

కలకత్తా, నవంబరు ౨౫

అలహాబాదు ఐకమత్య మహాసభ యొక్క ఉపసంఘమునకు కార్యదర్శియగు పండిత గోవింద మాలవ్యాగారు ఒకప్రకటనలో నిట్లు చెల్పుచున్నారు

అనేక సంఘములును వ్యక్తులును అలహాబాదు ఒడంబడికను గురించి తమవారి యభిప్రాయములను తెలిసికొనుటకు కొంతకాలమవసరము గావున ఐకమత్య సభయొక్క తేదులను మార్చుటకు పండిత మదనమోహన మాల్యవాగారు మౌలానా అబుల్ కలాం ఆజదుగారిని కోరియున్నందున, తేదులు మార్చబడినవి ఉపసంఘము డిసెంబరు ౧౦వ తేదినాడు కూడును ఐకమత్యసభ ౧౧, ౧౨ తేదులలోజరుగును సర్వపక్షసభ ౧౩ వ తేదినాడు జరుగును అన్నియు అలహాబాదులో జరుగును (ఆ ప్రె)

---

# స్వరాజ్యాందోళన పరిస్థితులు

నవంబరు ౨౩ వ తేదినాడు పెషావరు నగరపు మేజిస్ట్రేటుగారు, జమ్నదాసు అనువారిపై, పోలీసుల యిన్స్పెక్టరు జనరలువకును సరిహద్దు రాష్ట్రమందలి యితరోన్నతోద్యోగుల కును బెదిరుపేరులేని, భయముపుట్టించుజాబులను వ్రాసినందుకు ఇం. క్రి. ప్రొ. కోడురొక్క ౫౦౬, ౫౦౭ సెక్షనుల ననుసరించి నేరము మోపెను

---

నవంబరు ౨౦ వ తేదినాటిరాత్రి అబ్దుల్ ఖాలెక్ పఠాను యాత్రోత్సవమునుండి మరలి వచ్చుచుండగా, ఎడమప్రక్కన ఎవరో అతనిపై కాల్చిరి కాల్చినవారితో కూడ ౭ మంది యుండిరట ఖాలెక్ పోలీసుఉద్యోగి ఎచ్చట ఏమిజరుగునది తెలియజేయువాడు ౨౨ వ తేదినాటి రాత్రి అతనిని యిక్స్రేసహాయమున ఆపరేషను పొందుటకై డక్కాకు కొనిపోబడెను ఈసందర్భమున ౫ మందియువకులు అరెస్టు చేయబడినారు

---

సింధు కాంగ్రెసుకమిటీ డిక్టేటరుఅయిన సీతాబాయమ్మ అరెస్టుచేయబడినది

---

సంసార్ సమాచార్ అను దేశభాషాదైనికపత్రిక కు క్రొత్తయడిటరు అగు ఆశ్వాను కుశల్దాను శివరాము ౫౦౦ రూపాయల ధరావత్తును చెల్లింపమని అడుగబడి

---

సేనుగుప్తగారి యారోగ్యము చక్కబడుట

---

కట్టనూని యిటునటు నడువగిలరు

కలకత్తా, నవంబరు ౨౪ —

రాజకీయ ఖైదీయగు సేనుగుప్తగారు యింతవరకును వాతబాధచే యెడమకాలి నుపయోగింప జాలక వైద్యశాలయాసుపత్రిలో నుండిరి ఇపుడు కట్టనూని యిటు నటు తిరుగగలరు (అ. ప్రె.

---

అమృతబజారు పత్రికచిక్కు

కలకత్తా, నవంబరు ౨౪ —

మిడ్నపూరుజిల్లా మేజస్ట్రేటుగా నుండిన డగ్లసుగారిని చంపినందుకు ప్రద్యోత్కుమార్ భట్టాచార్యునికేసు విచారించిన కమీషనర్లను నిందించిరని అమృతబజారుపత్రికయొక్క సంపాదకుని, ముద్రాపకుని ప్రభుత్వమువారు శిక్షింప కోరిరి. సంపాదకుడు స్వయముగా కోర్టువారిముందు ఒక వాఙ్మూలమును వ్రాసిచ్చెవాలుచేసి అందు విచారణయందున్న ప్రకటనలకు న్యాయము క్రమముగా జరుగనీయ కుండుయుద్దేశ్యము లేదనెను. అ. ప్రె.

---

పూనా యొడంబడికను

౫౫ మంది బెంగాలుహిందువులు

మార్పగోరుట

---

బెంగాలులో విన్నజాతులసమస్య లేవందునను, లోధియనుకమిటీవారి సూచనలు బెంగాలు పరిస్థితికి త్వరలో అనుకూలింపగలవుగనుకను పూనా యొడంబడికను మార్పవలెనని సూచింపుచు ౫౫ మంది బెంగాలుశాసనసభాసభ్యులు రౌండుటేబిలుసభకు డెలిగేటగు యస్ యస్ సర్కారుగారికి తంతినిచ్చిరి

---

సర్ మహమ్మదు యిక్బాలుగారు లండనులో నేషనలులీగువారి సన్మానమును పొందిన సందర్భమున రౌండుటేబిలు సభనుగురించి చాలా యుత్సాహమును సూచించిరి బ్రిటను యిండియాను నమ్మినచో యిండియాబ్రిటనును నమ్మునని చెప్పెను అప్పుడు మౌలానా షౌకతలిగారు కూడ యుండిరి.

---

బొబ్బిలిరాజాగారిని మదరాసురాష్ట్రమునకు ప్రధానమంత్రిగా నియమించినందుకు సంతోషమును తెల్పుటకై మదరాసులో జరిగిన కోటవిందుకు ౭౦౦ మంది యూహూతులు వచ్చిరి.

---

హైద్రాబాదు

## ప్రత్యేక దైనిక ప్లేగు నివేదిక

ఈక్రింద యిచ్చియున్న సంఖ్యలు ప్లేగు ప్రారంభమైనది మొదలుకొని ఆయా తేదుల అర్ధరాత్రివరకు ప్లేగు తగిలిన వారియొక్కయు, ప్లేగువల్ల చచ్చినవారి యొక్కయు మొత్తములను తెలుపును

| తేది | ప్లేగుతగిలినవారి సంఖ్య | ప్లేగువల్ల చచ్చినవారిసంఖ్య |
|---|---|---|
| ౨౩-౧౧-౧౯౩౨ | ౨౪౯ | ౧౭౧ |
| ౨౪-౧౧- ,, | ౨౭౫ | ౧౭౭ |
| ౨౫-౧౧- ,, | ౨౯౪ | ౧౯౫ |
| ౨౬-౧౧- ,, | ౩౦౬ | ౨౦౨ |
| ౨౭-౧౧- ,, | ౩౧౫ | ౨౦౬ |
| ౨౮-౧౧- ,, | ౩౨౩ | ౨౧౩ |
| ౨౯-౧౧- ,, | ౩౩౦ | ౨౧౬ |

---

# ప్లేగు

భయములేదు! త్వరపడుడు!!

మహామారీ నివారణయంత్రం ౫ రూ

ఈయంత్రము దేవీసంబంధ బీజాక్షరములు కలిగియున్నది. ఇట్టియంత్రములు బెంగుళూరు, మైసూరు ధరించి నిర్భయముగా యీ వ్యాధిగల స్థలములయందు తిరుగుచున్నారు గాన ప్రతివారు జ్వరము, తగులక ముందు ధరించుకొనవలెను. ధరించినమీదట జ్వరమువచ్చి నష్టమయిన రయికము వాపసు యివ్వబడును, భయములేదు యింకాయితరకోర్యములు సాధించుటకు యంత్రములు యున్నవి—త్వరపడిన సమాధానము

మేనేజరు
సి యస్. శాస్త్రి
రావిచెట్టు వీధి (మద్రాసు)

---

**H. E. H. The nizam's State Railway**

## మ. ఘ. వ. నిజాము గారి సంస్థాన పురైల్వే

# నోటీసు

౧౯౩౨-౩౩ క్రిస్మసు సంవత్సరాది సెలవులకు కన్సెషన్ రిటర్ను టిక్కెట్లు

౧౯౩౨ వ సంవత్సరము డిసెంబరునెల ౧౪ వ తేదీ బుధవారము మొదలుకొని, ౧౯౩౨ వ సంవత్సరము డిసెంబరునెల ౩౧ వ తేది శనివారము వరకు, రెండురోజులను చేర్చి, యస్. యస్. రైల్వేమీద స్థానికముగను ... క్రింద చూపిన ప్రకారము తగ్గింపబడిన చార్జీలకు టిక్కెట్లు యివ్వబడును:—

| | | |
|---|---|---|
| మొదటి తరగతి<br>రెండవ తరగతి | ఎటుపోయినను ౧౦౦ మైళ్లకు పైబడిన దూరమునకు | సింగిలు చార్జిలో ౧ ౧/౩ భాగమునకు |
| మూడవ తరగతి<br>అన్నిబండ్లలో | డిటో | సింగిలు ఛార్జిలో ౧ ౧/౪ భాగమునకు |

ఈ రిటర్ను టిక్కెట్లను ౧౯౩౩ జనవరి ౧౬ వ తేది అర్ధరాత్రికి మరలివచ్చు ప్రయాణమును పూర్తిచేయుటకు పొందవచ్చును

ఇతర విశేషములకును ఇతర రైల్వేలమీద యిచ్చు కన్సెషన్లకును స్టేషను మాస్టర్లకు గాని యీక్రింద చేవ్రాలు చేసినవారికిగాని వ్రాయుడు.

చీఫ్కమర్షియల్ మేనేజరుగారి ఆఫీసు,
సికింద్రాబాదు (దక్కన్),
౨౦, అక్టోబరు, ౧౯౩౨

(ఆజ్ఞచేత)
డి. బి. బ్రెవరు,
చీఫ్కమర్షియలు మేనేజరు.

---

గోలకొండ పత్రిక
అంగీరస నామసం॥ మార్గశిర శు॥ 3
బుధవారము

## తఖ్రీమ్

మన రాష్ట్రములో అధికారులు లోకరి కొకరు వ్రాసికొనునప్పుడు చిన్నవారు పెద్దవానికి "గుజారిష్" (విజ్ఞాపన) అనియు, పెద్దవాడు చిన్న అధికారికి "నిగారిషు" అనియు వ్రాసికొను చుండెడివారు. సమానీకులు నిగారిషు అనియే వ్రాసికొను చుండెడివారు. ఇది మొగలాయి పద్ధతిగా నుండెను. కొన్ని కొన్ని సమయములతో సమానీకులలో నొకనికి అవసరమగు పనిబడిన గుజారిషు అని వ్రాసి సంతోషపెట్టదలచు చుండెడివారు. కొన్ని సమయములలో తగవులు పెరుగు చుండెడివి నేను పెద్ద నేను పెద్ద నీవు చిన్న నీవే చిన్న అని. కాని బన్నిగారి పుణ్యమున ఈ తగవు లన్నిటికి స్వస్తి చెప్పి తిలాంజలి విడిపించ బడినది. ఇప్పుడు తఖ్రీమ్ అనియే వ్రాయవలెనని ఆజ్ఞ యైనది. తఖ్రీ మనగా "వ్రాయుట యేమన" యని అర్థము. ఏ పంచాయితియు నిందులేదు. ఇది నిజమైన ఆంగ్ల పద్ధతియే! ఆంగ్లేయులు సర్వసమత్వము నెట్లుజటింప జూచుచుందురో యాపద్ధతియొక్క వాసనయే నిందు గానవచ్చినది. చాల శ్లాఘనీయము ఇంకను గుజారిషులవంటి పూర్వాచారములు కొన్ని మన దేశమందు గలవు. అట్టివికూడ త్వరలో మార్చి సంస్కరింతురని ఆశకలుగు చున్నది.

---

## ఆలెనుగారి వింతవాదము

---

పూర్వము మనభారత దేశమందు లెజిస్లేటివ్ అసెంబ్లీలో సభ్యుడుగానుండిన బి. సి ఆలెనుగారు లండనులో కామన్సుసభయందు కన్సర్వేటివు పక్షస్థుల యిండియా కమిటీవారి మ్రోలనిచ్చిన యుపన్యాసమందు ఒక వింతయైన వాదమున్నది. బ్రిటిషు మంత్రివర్గమువలె శాసనసభవారికి జవాబుదారి వహింపవలసియుండు మంత్రివర్గములు అమెరికాయందున అనేకములగు యూరపీయ దేశములయందును లేవనియు, స్వరాజిస్టు పక్షమువారు అధికారమువహించినప్పుడు ఆ పద్ధతిసాగజాలదనియు. శాసనములను సరియైనపరిస్థితులను చెడకుండ గాపాడు అధికారమును అనేకులు భారతీయులు తమకు మార్చవలెనని కోరుటలేదనియు, పార్సీలకు యిండియాలో వ్యాపారము చేయుటకు ఎంతహక్కుకలదో అంతహక్కు బ్రిటిషువర్తకులకును కలదనియు, వారి లాభములను కాపాడుట ముఖ్యమనియు ఆలెనుగారుపన్యసించిరి.

మాయూహా సత్యమగుచో, అమెరికా మొదలగు దేశములయందు "కేబినెట్టు" పద్ధతిలేదు. గావున యిండియాకు కూడ అది పనికిరాదని వారివాదము. బ్రిటను దేశములో ఆ పద్ధతియున్నదిగనుక యిండియాకుకూడ ఆపద్ధతిపనికివచ్చునని వాదించుటకు వారికిష్టములేదు కాబోలు! వాస్తవమేమనగా, ఒక దేశములో యున్నదన్నంత మాత్రాన యొకపద్ధతి యిండియాకు పనికివచ్చుననిగాని కొన్ని దేశములలో లేనంతమాత్రాన అది యిండియాకు పనికిరాదనిగాని వాదించుట మౌఢ్యమును దెల్పును. ఆయా దేశముల పరిస్థితులను బట్టి అచటచటి పద్ధతులు ఆచారములు ఏర్పడుచున్నవి.

అమెరికాలో మొదట రాజ్యాంగ చట్టమును నిర్మించినప్పుడు అనేకులు అధికార విభజనమును దానికై ఎక్కుగా మోహించుచుండిరి. అందువలన శాసన నిర్మాణమును, తత్పాలనమును నిర్వహించు యధికారములును విభక్తములయ్యెను. ఇపుడును చట్టముప్రకారమిదే పద్ధతియైనను, అనుభవమందు అధిక బలముగల యొక్కపక్షము వారే పరిపాలక నిర్వాహకులను, శాసన నిర్మాతలను ఎన్నుకొను చున్నారు పక్షాభిప్రాయమంతయు ఒకటిగావున శాసనసభకు వ్యతిరేకముగా అమెరికాయొక్క అధ్యక్షుడు నడుచుట సంభవింపదు ఇట్లు ఫలితమందు కేబినెట్టు ప్రభుత్వమే యగుచున్నది.

ఇతర యూరపీయ దేశములలో రెంటికన్న మించియుండు పక్షములుండుటచే, రెండుమూడు పక్షములు గలిసిగాని బలవంతము కాజాలవు. గనుక కేబినట్టు ప్రభుత్వము బూటకమగుచున్నది.

ఇప్పుడు భారతీయులకు తమరాజ్యమును ఏలుకొను అధికారమేలేదు. రాజ్యపాలన సూత్రముల గూర్చి వివిధ రాజకీయ పక్షములు ఎట్లుండును. అవియు లేవు. అందువల్ల యూరపీయ దేశములయందువలె రెంటికంటె యెక్కువయగు రాజకీయ పక్షములుండుటచే బాధ్యతాయుత ప్రభుత్వము సాగదనుటకు వీలులేదు. అమెరికాయందు రాజ్యాంగ నిర్మాణమప్పటివలె యిపుడు యిండియాలో సంపూర్ణమగు అధికార విభజనము కోరువారులేరు. అట్టి సంపూర్ణత్వము దుస్సాధ్యమని అందరు ఎరుగుదురు.

స్వరాజిస్టు పక్షమువారు అధికారమును వహించినప్పుడు కాబినెట్టు పద్ధతిని సాగదని ఆలెనుగారు భయపడుచున్నారు. ఈ భయమునకు కారణమేమో వారు దెల్పరైరి. మాంట్ఫర్డుసంస్కరణములను ప్రవేశపెట్టినప్పుడు "స్వరాజిస్టుల యుక్తులు" అనునది ఆ వివిధరాష్ట్రములయందు రాజ్యపాలనను నిరోధించెనను కారణమే వారుద్దేశించియుండుచో, అప్పటివలె కొద్ది స్వాతంత్ర్యమునిచ్చియు దానిని బూటకముచేయు మరి కొన్ని అడ్డముల కల్పించిననే తప్ప ఆభయముండ బనిలేదని మేము చెప్పగలము.

చాలమంది భారతీయులు లా అర్వర్నను తమ వశము చేయవలెనని కోరుటలేదనుమాట అసత్యము ఈయకుండ తప్పించుకొనుటకిది యుపాయము.

---

## భగవత్ప్రార్థన

---

( నం. జగన్నాథరావు )

శా- ఏ దేహ జన్మము లెత్తినన్ మరియు నే
దే కాపురుల్ జొచ్చినన్
నాయందున్ గృప సేయ వేడుకొనెదన్
నావల్ల నే జీవికిన్
మాయల్ హానియుఁ గల్గకుండ వలయున్
మన్నాసనం బెప్పుడున్
బాయన్ రాను భవత్పదాంబుజములన్ ప
ద్మాక్షా నారాయణా!

శా. గుమ్మ మ్మందున నిల్చి భిక్షుకుఁడు సం
క్షోభించి యాచించి యో
యమ్మా యంచును బిల్చి పిల్చి చను నా
యానంబునన్ బల్కమిన్
నెమ్మిన్ నీవును నట్లు చేసెదవా? కానీ
నీదు పాదమ్ములన్
సమ్మానమ్మునఁ బట్టి నే విడువ నా
చావైన నారాయణా!

శా. వేళాకోళము! వెక్కిరింతలా! నినున్
వే వేల ప్రార్థింప నీ!
వేలా నా మొర లాలకింపవు గృపన్
హేళిన్ ననున్ బ్రోవవా?
చాలన్ బల్కెడ రార్యు లెప్పుడు దయా
సాంద్రుండుగా నీటిపై
వ్రాలా యన్నియు, నమ్మిక మ్మొదవగా
బాలింపు నారాయణా!

శా. మార్జాలంబున కాటయై పరగు న
మ్మార్గంబు ప్రాణాంతమై
నిర్జించున్ గద మూషికంబు నటులే
నీ విట్లుపేక్షించినన్
దర్జింపంగను బూనుకొన్న నికనేఁ
దాళంగ లే నీవునన్
వర్జింపన్ దలకొన్న నీదు పదముల్
వర్జింప నారాయణా?

---

## ఆరోగ్య శిబిరములకు పాఠశాల

---

మార్కెట్టు వీధియందున్న పరోపకారిణీ బాలికా పాఠశాలా ప్రధానోపాధ్యాయిని యగు శీతాబాయమ్మగారు మారేడ్పల్లి యారోగ్య శిబిరములను ఒక పాఠశాల నేర్పరచి యింగ్లీషు, తెనుగు, సంగీతము, వ్యాయామము బాలికలకు నేర్పాటులు చేసినారు ఆరోగ్య శిబిరముల యిబ్బందులను సైతము లెక్కింపక ఆచ్చటి తల్లిదండ్రులు తమబాలికలను ఆపాఠశాలకు పంపుచున్నారు

---

## ఒక విచిత్రమైన కుక్క

---

(అరుణ్మారు విలేఖరి)

---

అరుణ్మారు తాలూకాలో చేరిన వికోల్పురమందు నొక బ్రాహ్మణుడు గోదావరియొడ్డున సంవత్సర పర్యంతము భజనచేయుచుండెను ఒకకుక్క యెచ్చటినుండియో వచ్చినది భజనపరులతోబాటు గోదావరి స్నానమునకు సంవత్సరపర్యంతము పోవుచుండెను మొన్న కార్తీక బహుళ పంచమినాడు గోపాలకాల్వ సమాప్తిరోజున కూడ అది గ్రామ జనులతో గోదావరీస్నానము చేసివచ్చుచు మార్గమధ్యమున ప్రాణముం చెను. భజనపరు లాకుక్కను పూవులు గోదావరిలో ముంచి పుష్పములతో నలంకరించి భజనతో సమాధి గావించిరి. తాలూకా ప్రాంతజనులు ఈవిచిత్రపరమేయ, మరణమునకు దుఃఖించుచున్నారు.

---

# పల్లెటూరి ప్రజల నివేదనము

## బొల్లేపల్లి

### కాలవ్యాలము స్థితి

కార్తీక బ॥ ౧ మి నుండి చలిగాలి మిక్కిలి వీచుచున్నది అక్కడక్కడ ప్రజలు శీతజ్వరములచేత పీడ నొందుచున్నారు మాగిచేనులు మనోహరముగా నున్నవి, సజ్జకోతలు పూర్తిగా అయినవి వరికోతలుకూడ అయినవి భావుల క్రింద కుంటల క్రింద పల్లి రయితులు దున్నుట మొదలిడినారు ఆరిక సెటి రహితులకు వేదన గలిగించుచున్నది వడ్ల ధర పల్లెలందు ఖ ౧ కి రు ౩౦ రు ౩౫ కొన్నిచోట్ల రు ౩౫ రు ౩౫ కూడా అమ్ముచున్నారు　　(ఒక విలేఖరి)

## జీడికల్లు

### శ్రీకృష్ణలీల నాటక ప్రదర్శనము

గత శనివారమునాడు (నవంబరు నెల ౧౯ వ తేదీన, జీడికల్లుకు యాత్రసందర్శనార్థమై జేసంచరుగగా, యుందు శ్రీ నెడికొండ నాటకసమాజము వారిచే ప్రదర్శింపబడిన శ్రీకృష్ణలీలనాటకరాజమును సందర్శింపవలసివచ్చినది. శ్రీకృష్ణ, దేవకీదేవి, వసుదేవ, అక్రూర పాత్రలను ధరించినవారలు తమ తమ భాగములను కడునిపుణతతో, మనోహరముగ ప్రదర్శించి ప్రేక్షకుల వావందింపజేసిరి గొల్లడాన్సు మనోరంజకముగా ప్రదర్శింపబడెను నాటకవాఙ్మయమున యెక్కువ పరిశ్రమ లేకపోయినను ఈ నాటక సమాజమువారు నాట్యకళయందారితేరిన వారివలె తమ నటనాకౌశల్యమును జూపినందుకు యెంతయు ప్రశంసనీయులు మొత్తముమీద నటకులందరు బహుబాగుగ తమపాత్ర పోషణమును గావించిరి హైద్రాబాదు రాష్ట్రమునందు యిట్టి నాటక సమాజములు కొన్ని యుండినను, ఆంధ్ర నాట్యకళ ఎంతయో వృద్ధికి రాగలదని నానమ్మకము నాటకమును యింత శ్రద్ధతో తయారొనర్చినందులకు నాటక సమాజపు మేనేజరుగారిని హృదయపూర్వకముగ అభినందించెదను

సం॥ జగన్నాథరావు

## ఆసఫాబాద

### తాలూకుదారుల మార్పు

### దుఃఖము—సంతోషము

ఆలీజనాబు నవాబు పుంజార్ జంగు బహద్దురుగారు పెన్షను పై వెళ్లుటవలన యిచటి జనులందరు కడు దుఃఖించుచుండిరి కాని యిప్పుడు క్రొత్తగా వచ్చిన తాలూకుదారు సాహెబుగారగు ఆలీజనాబు మౌల్వీ ఖాజీజైనల్ ఆబెదీన్ సాహెబుగారు గూడ రైతులపై ప్రేమగలవారే కాబట్టి సంతసించుచున్నవారు

### ధర్మశాల

బ॥ శ్రీ శాటికొండ భద్రబ్రహ్మాచార్యులుగారు ఆసఫాబాద గ్రామమందొక గొప్ప ధర్మశాల కట్టించబోవుచున్నారు గాన బాటసారులకు (ముసాఫిర్లకు) చాల సుఖముగా నుండును.

(ఒక విలేఖరి)

## విపరీతపు ఆత్మహత్య

### సింగరేణి కాలియర్సు

౨౪—౧౧—౧౯౪౭

నిన్న టిరోజున యీగ్రామమున బజారు మార్కెటునందు నివసించెడు ఒక వైశ్యకులజుడు తన గృహమునందే ఉరి తీసుకొని యుండెను ఉదయమగుసరికి వందలకొలది జనులు అదృశ్యము గాంచుచుండిరి మధ్యాహ్నము రక్షకోద్యోగస్థులు పంచునామా చేసి అతనిజేబున పుత్తరముండుట గాంచిరి ఆపుత్తరమందు „తనకై తాను ఆత్మహత్య చేసుకొనబూనినట్లును, కొంతకాలమునుండి యొక స్త్రీపై వ్యామోహత జెంది యట్లు చేసుకొనుచుంటి ననియు, యిందుకు కెవ్వరు బాధ్యులు కారనియును, తనకు స్త్రీనిగురించియు మొదలు గాగల విషయములు" వ్రాయబడియుండెను వైద్యాధికారి డాక్టరు పరీక్షించి అయినపిమ్మట సాయంకాలము ౫ గంటలకు కులసులచే శవదహనము గావింపబడెను　　(ఒక విలేఖరి)

### మునగాల రాజాగారి గ్రంథాభిమానము

మునగాల సంస్థానాధీశులు, రాజానాయని వెంకటరంగారావు బహద్దురుగారు హనుమకొండలోని యాంధ్రగ్రంథాలయమునకు ౨౦౦ రూపాయల విరాళమిచ్చిరి, మరి వాల్లు వందలుకూడ యొసగెదమనిరి గ్రంథములకు క్రొత్త యాలయము కట్టుట పూర్తియైనది అలయప్రవేశ మప్పుడు రజతోత్సవం చేయవచ్చును

## జాబులు

### గువ్వలగూడెము

(విలేఖరి గారికి)

గోలకొండ పత్రిక ౨౧—౧౧—౪౭ తేది తమలేఖను నేను ఖమ్మం పాల్గిరా మహోత్సవమున ప్రభువుగారి సంకీర్తనమునకు వెడలినందున కొంచె మాలస్యముగా జవాబునకొటంకమేగాక నాకవసరముగా కావలసిన పత్రికలనే యెవరో సంగ్రహించు చున్నందున ప్రస్తుతమిట్టి సంభమునుగూడ బయలుదేరి వంగుకు విచారబడు చుంటిని.

తామే కారణమునకో యిన్ని సంగతులు ప్రకటించి తమపేరు మాత్రము మాటుబరచిన లాభమేమి? కోర్టువిచారణ సెపలా జూడెజాలకున్నను బా వా యెవరెవరిమీద చేయబడినదైనను తెలిసికొన జాలనంతటి తొందరలో వ్రాసిరాయేమి? అయితే వారు చేప్పే విషయములకంటె మీ చాకచక్యము, అంగుష్టములు పెట్టించుకొని తర్వాత చెల్లుచేసినారనుట అనుభవజ్ఞులగు తమబోటివారు తప్పవిశ్వసించు వారివలెనాయుండుటో కోర్టువిచారణ యందీవిషయము రుజువుపరచిన డిక్రీగూడ యగునా? కోర్టువారు „సాక్ష్యము నిజముకాదని" కొట్టివేయ వచ్చునేగదా తమకోథారములు లభ్యపడి అప్పులకు బోవుచుంటిరి కావోలు అయితేమీకు బుద్ధిచెలసిన దమ్మిటునా నాదున్న పోతుకుమందు బెట్టించంపినది! అంతలో „పోలీసువారు" విర్బంధించి నోటు వ్రాయించిన మాట మీకే తెలుసునా? లేక అప్పటి పోలీసు పటేలుతన రోజునామాచాయందు వ్రాసియుంచినది జూచిరా? ఇప్పటికెంత కాలమైనది? మీకిప్పుడెంత వయస్సు? అప్పుడెంత వయస్సు! లేక తాము నాగువంతలలో దిరుగుచు విన్నజ్ఞాపకమా? రెండు మూడుసార్లు „పంచముల"ని అభిమానము సూచించితిరేకాని వీరినుండి తక్వనాగు రూపాయికి అణా మొదలు బేడవరకు వడ్డి నిర్దాక్షిణ్యముగ స్వీకరించుటయేగాక వారి భూములుబాకీ

లక్రింద సులభముగా పొలకుగట్టు కొనుటయు సరియైనయక్షరముల చెప్పుకొనే నాటుకోళ్లు కేను యిచ్చువచ్చినట్లు యేర్పరచియిచ్చు నలవాటుగల మిత్రులయందు ప్రబోధము సలిపనివారించితొలని భగవంతుడు మెచ్చునని నాయుహ

ఈగ్రామము లో నోకకాలమున పంచములకు నాకు తగాదా కొంతకాలము జరిగినప్పటికి ధ్యంకోగొన్న ముద్దతుల గలించిన దస్తావేజా లున్నవి మీకోర్టులో రుజువుపరచుకున్న విస్పష్టపాతముగ తామేమైన యిప్పించెదరా? నాకా సంగతులు తెలియవలెదరా? వారు పంచములైనను భగవదనుగ్రహమువల్ల మంచిస్థితిలో కాలము జరుగుచున్నది యిత రాదాయములు గాకనే ప్రభుత్వమువారి యు ౮౪ ౩౬ రుగ౬౧ ఇనాములున్నవి కోర్టువారన్యాయముగ విమర్శనలేక ప్రసాదించిన ఫైసలాయని తాము విచారపడ నక్కరలేదు

ఇట్టువిన్నవించు

వెంకట నరసింహారావు పట్వారి

——

## మహారాజశ్రీ గోలకొండ పత్రికాధిపతిగారి దివ్య సన్నిధిక

మహబూబు నగరుజిల్లా కొత్తకోటపోష్టు వర్నగ్రామం శేషగిరిరావు అనేక దండముల సమర్పించి వ్రాసుకున్న విజ్ఞాపన యేమనగా అంగీరస నామసంవత్సర కార్తీక బ॥ ౬ శనివారము పత్రిక (౭) ఆకులో

### మాతంగ యోగిని

విచారం వ్రాసియున్నారుకాని ఆయమ్మగారి పూరుపేరు జిల్లా తాలూక, రయిలుమార్గమా, మోటరుమార్గమా, ఏదియూ వ్రాయలేదు కాబట్టితమకు శ్రమయిచ్చుకొనటం అయినది తీదవానియందు దయవుంచి పైవాంశములు పత్రికమూలకముగా తెల్పినయెడల సర్వత్రులకుగూడా తాము మేలుచేసినవారగుదురు ఆయమ్మగారి సందర్శనార్థమయ్యి చాలామంది జనులు ప్రయాణ సన్నాహములోవుండితమదయగల జవాబు కునరీక్షించుతు వున్నారు

ఇట్లు

శేషగిరిరావు వర్మ

——

## స్థానిక వార్తలు

## సత్యనారాయణ వ్రతోత్సవము

౨౦ నవంబరు ౧౯౩౨ ఆదివారము పగలు ౧-౨ గం టలనుండి రాత్రి ౧౧ గంటలవరకు చాదరుగాటు వాల్ద్రి ప్రక్కన ఆదిహింద సాంఘిక సేవాసమితి భవనములో నరనారీమణులు క్రిక్కిరిసి యుండిరి హైదరాబాదు సికిందరాబాదు మలగిరి బొల్లారము చిలుకలగూడ కొప్పగూడ నుండి సుమారు ౨౦౦౦ మంది సభకు విచ్చేసిరి హైదరాబాదు ప్రముఖులలో అనేకులు యీ వుత్సవమునందు పాల్గొ నతీర్థ ప్రసాదములను గైకొని తమసానుభూతిని బయలు పరచిరి అందులో శ్రీయుతులు దేశభక్త వామన రామచంద్ర నాయకుగారు మాడపాటి హనుమంతురావుగారు శ్రీకిషన్ బ్యారిష్టరుగారు డాక్టరు రామస్వామి నాయుడుగారు సురవరము ప్రతాపరెడ్డిగారు నారాయణలాలు చగన్ లాలు వ్యాసు జీమహారాజు చున్నిలాలు మొహన్ లాలు వెంకటరావు అర్ రామస్వామి గార్లుండిరి ౨ గంటలనుంచి భజనప్రార్థనోపాసన బాలబాలికల దైవప్రార్థన జరిగినది ఆరుంధతీయ నాయకులగు ఏ౯ ఏచ్ శేషగిరి రావుగారు కథజరిపిరి తరువాత మార్వాడి పండితులవారు కథసారాంశములు ప్రజలకుబోధించిరి ౬-౧౧ గంటలనుండి ధర్మవీర దేశభక్త వామన రామచంద్ర నాయకుగారి ఆధిపత్యమున ఏకమత్యము నుగురించి వుపన్యాసములు యిచ్చిరి అందరుకలసి కూర్చున్న దేకాక ప్రసాదములను స్వీకరించిరి యిదిగాక మహానాటి మాల నాయకులగు భాగ్యరెడ్డిగారు ... డాక య్య (సేవకుదాసు) మొట్టు వెంకట రాజులు ఆది హిందుభవనము మామహానాటి మాలలదే అనియు అందులో ఆరుంధతీయులకు హక్కులేదని పురుషు తెలుగు పత్రికలను ముద్రించి పంచియుండిరి దీనిపై వామనరావు నాయకుగారు తమ వుపన్యాసములో యిన్ని వెలువచ్చియుండిరి యీపత్రికలు ఆదిహింద అధికారముచే ముద్రించినవికావు ఆదిహింద సాంఘికసేవా సమితి మ్యానిజింగు కమిటిలో తీర్మానించినది వెల్లడించిరి అని తెలిపిరి శ్రీకిషన్ బ్యారిష్టరుగారునూడ ఆదిహిందువు లనబడు వారిసంఘమునకు ఓటుకుపనలయుగా వెలవిచ్చిరి వామనరావుగారు విద్య నుగురించి చక్కని వుపన్యాసము యిచ్చిరి ఆరిగెరామస్వామి వెంకటరావు వగైరాలు ఏకమత్యమును గురించిమాటలాడిరి ఆరుంధతీయ సభతరఫునుండి సభవారందరికి కృతజ్ఞతా వందనము లర్పించి ప్రముఖులను ఫలహారములచే సన్మానించిసభ ౧౧ గంటలకు ముగించ బడినది ఆదిహిందుభవనములో యిదివరకు యింతగొప్ప సభజరిగి యుండిలేదని చెప్పుటకు సందేహములేదు

ఇట్లు

ఒక ప్రేక్షకుడు

——

## శాసనసభకు క్రొత్త సభ్యుడు

కాలీయైన ఎంగలి వెంకట్రామారెడ్డి గారి స్థానమున శాసనసభకు రాజబహదూరు బన్సీలాల్జి మోతీలాల్జిగారు నామినేటు చేయబడినారు వీరుసుప్రసిద్ధ జాగీరుదారు బ్యాంకరు

——

### బ్రహ్మశ్రీ కీర్తిశేషులైన మన్మిత్రులును డాక్టర్ పీ వి రమణయ్యగారి తమ్ముడు గారును అగు వేణుగోపాలరావుగారి నిర్యాణ సమాశ్వాసము

——

సీ॥ తను వెల్లఁగను లరఁగా • నొనరించుకొనిఁజూడు
తల్లి మఃఖాంభోధి • దాటు టెట్లు
అడుఁగడుగునఁ బ్రేమ • నానందమునఁజొక్క
యన్నదమ్ముల శోక • మారు టెట్లు
మేనమామయునీకు • మేలుబంధులచిత్త
మంటఁబుట్టినగోడు • కవధియెట్లు
దేశోపచారసం • దేశముల్వినఁగోరు
భవ్యమిత్రులచింతఁ • బాయు టెట్లు
గీ॥ ఇందరకునిట్లు వ్యసనము • లందఁజేసి
చూపులోనుండి యుఁగడఁగ • నూపుఁద్రిప్పి
వేణుగోపాల! శ్రీచక్ర • పాణిఁజూడ
నరగినాడవె మఱుఁబాసి • యమరపురికి

ఉ॥ అన్నలచిత్తముల్ వ్యసన • మందువఁగ్రుంగఁగ దోడుఁబుట్టువుల్ కన్నులనీరుగార్ప నిను • గాంచినతల్లికి గర్భమందనల్ ఎన్నఁగరాని చిచ్చొకటి • యేర్పడి భగ్గురనంగనిట్లు వి॥ ద్వన్నుత వేణుగోపకుని • తత్త్వముఁజూపుచు నంతరించితే!

చ॥ అరయఁగ నాంధ్రవాఙ్మయము • నాంగ్లమునున్ దగనభ్యసించి సు॥ సిరముగ వైద్యశాస్త్రమునఁ • జేయి యొకింతఁ గదల్చి, కావ్యముల్ । చొరవఁగ నేర్చి సొంపెసఁగి • శోభిలుచుండెడి సచ్చరిత్ర వే॥ వరలుచు నిట్లు నీవునిజ • వంశలతాళికిఁ బ్రోదివెట్టవే!

గీ॥ తండ్రి మఱపించి నిజసౌఖ్య • త కిమించి
అన్నివిధములఁజూచు మీ • అన్నయైన
రగణను గొన్న సద్విద్య • రత్నమయిన
రమ్యగుణధాము వెంకట • రమణయార్యు
నందఁగలకూర్మి తుదలేని • చోటచేత
బంధుజనముల మిత్రుల • పట్టువీడి
ఆగ్నిపురియైన నెల్లూరు • యాసవీడి
కూలనొవ్వకె కోప్పచు • సొమ్మసిలుచు
అన్నఁదరిఁజేరి నిశ్చింత • నతనిదివ్య
పాదముల ప్రోలకోచేసి • ప్రాణములను
విడచినాఁడవు గుణధన్య • విప్రవర్య!

ఉ॥ అన్నలును వ్యయుల్ మిగుల యాతురతో గుణతేనికువిద్యలన్ గ్రన్నన గర్భినారుఁగద • కాలప్రవాహము ముప్పుదెందకే విన్న మహీసలిల్ విడుచ • నేర్పినకో నడే బంధుమిత్రులన్ గన్నులనశ్రువుల్ గురుర • గానిటు సేసియు వీడిపోయితే

ఉ॥ అన్నలవారి భార్యలను • యంచితమొప్ప గఁదగ్గఁ ద్రుల౦ జెన్నుచు భక్తితోడుతను • నిమ్మహిఁ వారలయందుసేవలన్ బన్న గనల్లవుకొరకుని • పద్మఁగుట్టుఁగజూపలేద సంపన్నగరాధ్యయే ఏమగుని • వర్ణనఁజేయఁగ విశ్వగర్భులే.

గీ॥ జరయు వ్యాధియును లేనట్టి • జన్మభజనసి
పరగ శ్రీహరి పదసేవ్య • భజనమొందఁ
జిత్తముంచి నీ సర్వదా • చిద్విలాస
పదవి పొందినందు వైకుంఠ • పట్టణమున
వేణుగోపాల! వరలుము • వేద్యశీలు ఁడ

బాగ్ సహా } పంతము అంజనేయులునాయుఁడు
లింగంపల్లి } హైద్రాబాద్

——

## హైదరాబాదులో హిందు మహాసభా సమావేశము

——

హైదరాబాదులో హిందూ మహాసభను సమావేశపరచుట కనుమతి గోరుచు తీర్మానము లన్నియు కొత్వాలుగారి పరీక్షకై పంపబడినవి.

——





——

# తక్కువ ధరలకు

# యెక్కువ వెలగల వస్త్రువులు!

యడ్సు వస్త్రములు యంత్రశాలలలో నేయబడి అచటినుండి నేరుగా చిల్లర అంగళ్లకును, స్టాకులుంచుకొను వాండ్రకును పంపబడుచున్నవి. ఈపద్ధతివలననే మరి యేటికిలేని వెలలు యడ్సువస్త్రములకుండుట సాధ్యమగుచున్నది.

ఈపద్ధతిన పనిచేయుటవలన కలుగులాభము నంతయు నీవుపొందుదువు. ఇంతకుముందు మధ్యస్థులకు పోవుచుండిన గొప్పగొప్ప లాభములు యిపుడు నీకువచ్చును.

అది ధరలు అంతతగ్గియుండుటకు కారణము,

మావద్దనున్న స్టాకులలో నూర్లకొలది పద్ధతులు ఉన్నవి. వాటిలో మేము ప్రత్యేకముగా రుచించువాటిని మూటినిగ్రహించినాము. స్టాకులోనుండు సరకులన్నిటియొక్క నిజమైనవిలువలు ఒకేవిధముగా ఆశ్చర్యమును కలిగించును.

( క్రింద వేసినధరలు హాలీసిక్కా )

## కోటుగుడ్డలు

అన్నిరకముల సరకులను. దిట్టమైనగుడ్డలు అనేకతరహాలు గానున్నవి. పలువిధముల రంగులుగలవి. అవి చక్కగా సరిపోవును. హాయికలిగించును. ఉతికినను రంగుపోను. ఇటువంటికోటులనేతగాళ్లు సాధారణముగా గ౧కి ౧౧ అణాలకుపైగా అమ్ముచున్నారు. అయినప్పటికిని యీకోటులు గ౧కి ౧౦ అణాలంత తక్కువవెలనుండి యివ్వబడుచున్నది.

## షర్టుగుడ్డలు

క్రొత్తరకములలో అందమైన సరకునీకెటువంటిదికావలెనన్న అటువంటిది దొరకును. గ౧కి ౫అ. ౩పై. నుండి ఇటువంటివెల మరియెక్కడను దొరకదు!

## కిటికీగుడ్డలు

కిటికీగుడ్డలకును, సామానులను కప్పుటకును ఇంకను ఇతరమైన వాటికిని. ఎండకు చెడవు. గ్యారంటీ నిజముగా వింతవెల. పట్టెలు గలది గజము ౧కి ౧౩ అ ౬ పైమా క్రెటోనోగజము ౧కి ౫ అ. ౩ పై

SEAL OF EDSU EFFICIENCY

యడ్సువస్త్రముల తక్కువధరలవలన లాభముపొందుడు

# EDSU Fabrics

యడ్సువస్త్రములుఅల్లాఉద్దీన్సుబిల్డింగ్, పత్థరుగట్టి, హైదరాబాద్.

## అంగడివాడు

ఐర్లెండుకు క్రొత్త గవర్నరు జనరలు

డేనియలు ఎక్లీ అను అంగడివాడు ఐర్లెండునకు గవర్నరు జనరలుగా నియమింపబడినాడు. అతడు మొదటి రెండవ డైలులలో (ఐర్లెండు పార్లమెంటు) సభ్యుడుగా నుండెను ౧౯౨౭ వ సంవత్సరపు ఎన్నికలలో ఓడెను. మరలనిపుడు పార్లమెంటు సభ్యుడుగ నున్నాడు,

వీరికి ౧౦౦౦౦ పౌనుల జీతము. అయితే అందులో కొంత భాగమును ప్రభుత్వమునకే యిత్తురట. వీరు సొంత యింటిలోనే యుండి పనిచేతురట

ఆర్య్వమందువలె చక్రవర్తిగారి చేతిని ముద్దు పెట్టుకొనుటకు పోరట

---

### బెంగాలులో ఉన్నత శాసనసభను స్థాపింపవలెనను తీర్మాన మోడుట

బెంగాలు శాసనసభలో యస్ యమ్ బోసు గారు ఒక విశేష నిర్ణయమును ప్రతిపాదించిరి. నూతన రాజ్యాంగమందు బెంగాలులో శాసనసభలు రెండుండవలెనని శాసనసభవారి యభిప్రాయమైయున్నట్లు స్థానిక ప్రభుత్వము వారు ఇండియా ప్రభుత్వము వారికిని బ్రిటీషు ప్రభుత్వము వారికిని తెలుపవలెనని ఆతీర్మానముండెను. దీనికి హిందువులు అనేకులును అనధికార యూరపియ సభ్యులును అనుకూలముగా ఓటు జేసిరి. అధికార సభ్యులు పాల్గొనలేదు. మహమ్మదీయులును కొందరు హిందువులును ప్రతికూలముగానుండిరి. తుదకు తీర్మానమోడెను

---

### డాక్టరు ఆలంగారిని వదలుట

డాక్టరు ఆలంగారు యిపుడు ఆపరేషను చెయించుకొనుటకు సమ్మతించినందునను, ఆపరేషనులో ప్రాణభయమున్నదని వైద్యులు చెప్పుటచేతను పంజాబు ప్రభుత్వము వారు ఆలంగారిని వదలుటకు నిశ్చయించినారని ఒక ప్రభుత్వ ప్రకటన చెప్పుచున్నది

ఆలంగారు ప్రభుత్వాధీనమందే యుండదలచినచో వారు తమవైద్యులనే నియమించి ఖర్చులనంతయు భరింపగలరని మేయో ఆసుపత్రి సర్జను గారు ఆలంగారికి తెల్పిరి. బిధన్ చంద్ర రాయ్ గారు ఆలం గారికి చికిత్స చేయ కలకత్తా నుండి వచ్చినారు. ఆలంగారందుకు సమ్మతించినారు

---

### విప్లవకారకునికి ద్వీపాంతవాసము

లైసెన్సులేని మందు సామానులనుంచు కొన్న నేరము

కలకత్తా నవంబరు ౨౮ —

రెండు అల్యూమినియము బాంబుగుండ్లను ఒక పిస్టోలును, ఒక రివాల్వరును ౫౫ తోటాలను లైసెన్సులేకయుంచుకొన్నందుకు హరిపాద చౌదరికి ఆలిపూరు స్పెషలు జడ్జిగారు ౧౦ ఏండ్లు ద్వీపాంతర వాసమును విధించినారు. అక్టోబరు ౧౫ వ తేదినాడు పోలీసులతని నరెస్టుజేసి అతని యింటిని సోదాచేసి నప్పుడు కొన్ని వ్రాసిన కాగితములుదొరకెను. సర్కారు నౌకర్లను ముఖ్యముగా యూరపియులను చంపి వారిసొత్తును ప్రభుత్వ వ్యతిరేకులు వారికి సహాయము చేయువారి సొత్తును నాశముచేయవలెనని ఆకాగితములలో నుండెను. నిందితుడు నిర్దోషినని వాదించెను

(అ ప్రె)

---

## సంయుక్తరాష్ట్ర శాసనసభ

ప్రభుత్వ మడిగినడబ్బును నిరాకరించుట

అడగదలచిన మిగతను ప్రభుత్వము వారు అడగకపోవుట

లక్నో, నవంబరు ౨౮ —

సంయుక్తరాష్ట్ర శాసనసభ నేడు ౪౦ నిమిషములు జరిగెను. గవర్నమెంటువారు అడిగినడబ్బును శాసనసభవారు నిరాకరించిరి. అనధికార సభ్యులు ఉపన్యసించలేదు. ఇందువలన ఆర్థిక మంత్రి అడగదలసిన డబ్బులో తక్కిన దానినడుగగలముకొన లేదని తెల్పెను

(అ ప్రె)

---

## జర్మనీ రాజకీయ సందిగ్ధస్థితి

జర్మని యధ్యక్షులగు, హిండెన్బర్గు గారు, నాజీలు సూచించినటు ఆమెరికాలో మాదిరి మంత్రివర్గము నేర్పరచి దానికి హెర్ హిట్లరు గారిని అధ్యక్షునిగా జేయుటకు నిరాకరించిరి. సెంట్రిస్టుల నాయకుడు మంత్రివర్గము నేర్పరచుటకు యత్నించు చున్నాడు. మళ్లీ పేపను గారికే ఛాన్సలరు పదవికి ఆహ్వానం రాగలదని ఊహింప బడుచున్నది

---

## పెరంబూరు వర్కుషాపు సమ్మె

యం యస్ యం రైల్వే ఏజెంటు గారు ఒక ప్రకటన గావించినారు. హుబ్లీలో మెకానికలు యలెక్ట్రికలు వర్కుషాపులలో నుండు ౪౦౦౦ మంది నౌకర్లలో ౩౦౦౦ మంది సమ్మెగట్టిరని పత్రికలలో ప్రకటించినారనియు, వాస్తవముగా అచటనుండు నౌకర్లు ౩౧౫౦ మందియేయనియు, సమ్మెగట్టినవారు ౯౫౦ మందియే యనియు ఏజెంటు గారి ప్రకటన తెల్పుచున్నది. నవంబరు ౨౨ వ తేదినాడు మూడు వందల మంది చేరినారనియు, పెరంబూరు ఆరక్కోణముల యందలి సమ్మె పరిస్థితులయందు మార్పులేమియు లేవనియు గూడ సదరు ప్రకటన తెల్పుచున్నది

---

కెన్నిసను కెల్వినను యంపైరు స్టాండర్డు జనపనార మిల్లుల కూలీలు పనిలో చేరుట

కలకత్తా, నవంబరు ౨౨

లిలుఘూరులోని కెన్నిసను కెల్వినను యంపైరు మరియు స్టాండర్డు జనపనార మిల్లుల కార్మికులు నెల రోజులకు పైగా సమ్మెజరిపి తిరిగి నేడు పనిలో జేరినారు (అ ప్రె)

---

## శ్రీకృష్ణ సంపాదకుని యరెస్టు

పాట్నా నవంబరు ౨౩

శ్రీకృష్ణ యను హిందీ దైనిక పత్రిక అచ్చగుచోటుపై పోలీసులు దాడివెడలి, ఆపత్రికకు సంపాదకుడును ముద్రాపకుడునగు నీలమణిదత్తు జోషీగారిని పికెటింగ్ ఆర్డినెన్సు క్రింద అరెస్టుగావించిరి

(అ ప్రె)

## తమలపాకు లమ్మువాని కథ ఏమయినది

కొమిల్లా నవంబరు ౨౩

నవంబరు ౧౭ వ తేదినాడు గౌరు చంద్రపాలు అను తమలపాకులమ్మువాని యెడల దౌర్జన్యమొనరించిన సందర్భమున కెప్టెను సెల్బి మెక్కరతుకభటులు అరెస్టుచేయబడినారు. వారు సైనిక న్యాయ పద్ధతి ననుసరించి విచారింపబడుదురు (అ ప్రె)

---

కాంగ్రెసువారి శాసనోల్లంఘనము, విప్లవకారులయాందోళనము కలిసి ప్రభుత్వము వారియెడల ప్రజలకు ద్వేషము కల్గించెననియు, ఆర్థికదుస్థితి వల్లను నిరుద్యోగ సమస్యవల్లను మరింతివ్యాప్తి జెంది నేరములను ఎక్కువజేసినదనియు, ఈనేరములతో పోరాడుటకు బెంగాలు శాసనసభవారు ౫౧౫౦౦౦ రూపాయల నధికముగా యిచ్చిరనియు ప్రభుత్వము వారు ౧౯౩౧-౩౨ లో బెంగాలు రాష్ట్ర పాలనను గురించి తెల్పుచున్నారు

---

H E H The Nizam's State Ralway

### మ॥ ఘ॥ వ॥ నిజాము సంస్థానపు రెల్వే

## నోటీసు

౧౯౩౨ డిసెంబరు, ౧ వ తేది గురువారము మొదలుకొని నెం ౪౧ అప్ మిక్సెడు బండి భోంగిరు, దూపాడు స్టేషనులవద్ద నిలువదు. తక్కిన కాలనిర్ణయములుమారవు

( ఆజ్ఞవలన )

| | |
|---|---|
| చీఫ్ ట్రాన్స్పోర్టేషన్ సూపరింటెండెంట్సు ఆఫీసు, సికంద్రాబాద్-దక్కన్ తేది 25, నవంబరు, 1932 | హెచ్ ఇ విలియమ్స్ చీఫ్ ట్రాన్స్పోర్టేషన్ సూపరింటెండెంటు |

## ఖుబాలియతులు

అనుకూలమగుషరతులు

క్రొత్తపద్ధతులు, మొదలగు నిబంధనలచే తయారు చేసియున్నాము. ప్రతులు మిగులుట లేదు ఆలస్యముచేసిన దొరకనేరవు. ధరలు తగ్గించియున్నాము. ౧౦౦ కి రు ౨ లు మాత్రమే.

గోలకొండ పత్రికాలయము,
హైదరాబాదు.

## సమస్తనేత్రవ్యాధులకు తృప్తికరముగ గుదుర్చు

### "లోటసుహనీ"

Lotus Honey

యను నేత్రౌషధము ప్రకృతియొసగినది. ఇది తామరపువ్వులనుండి గ్రహింపబడిన తేనె శస్త్రవైద్య మవసరము లేకయే కండ్ల పొరలను కోయును చమత్కారమైన నిర్మితిగ నత్యంతను లభ్యముగ దీనినుపయోగించ వచ్చును. దృష్టిదోషములేని కన్నులకుపయోగించిన రాబోవు వ్యాధుల నుండి రక్షించును. నేత్రరోగములు, దృష్టిలోపము, రేజీకటులు, కంటిముయలు, కంటిపువ్వులు, కంటికూనలు, దృష్టిమాంద్యము, కంటికురుపులు, శ్వేతకామిల, కృష్ణకామిల, హరిద్రాకామిల, నదానీరుకారుట, నొప్పి, కాంతిహీనములగుట, మొదలగు జాడ్యములకన్నిటికి వజ్రాయుధము.

ఇంగ్లీషు ఔషధ విక్రయశాలలన్నిటిలో లభించును. నైజాము రాజ్యవాస్తవ్యుల సౌకర్యము వకైన నీక్రింది వారల నేర్పరచి యున్నాము.

జే. ఫౌస్టు. అండుకంపెని. సికింద్రాబాదు
J. Faust&co., Secunderabad



## ఎంపైరు ఆఫ్ ఇండియా లైఫుఅస్యూరెన్సు కంపెనీ లిమిటెడు

సం॥ ౧౮౯౭ లో స్థాపితము

౧౯౩౪, మార్చి, తే ౧ దీకి ముందు క్లైములగు పాలసీలపైన పర్చడు ఇంటరిమ్ బోనసులు ఈ క్రిందివిధమున వృద్ధిచేయబడినవి.

| | |
|---|---|
| యావజ్జీవితపు భీమాలైనచో | యండోమెంటు భీమాలైనచో |
| సంవత్సరమునకు | సంవత్సరమునకు |
| రూ ౧౦౦౦ లకు రూ ౧౬. | రూ ౧౦౦౦ లకు రూ ౧౪ లు |

హెడ్డాఫీసు
యంపైరాఫ్ యిండియాలైఫ్
బిల్డింగు బొంబాయి

Head Office
EMPIRE OF INDIA LIFE
Building Bombay

అలమ్ భారుచా
అండుకంపెనీ
మానేజర్లు

ALLAM BHARUCHA & Co
Managers

Apply for prospectus to
ప్రాస్పెక్టసు మొదలగువివరములకు క్రింది చిరునామాకు వ్రాయుడు

వి. యన్. పురోహిత్
బ్రాంచి సెక్రటరీ

V. N. PUROHIT
Branch Secretary
Residency Hyderabad Deccan

## స్వదేశీ స్టేషనరి కావలయునా?

అన్నిరకముల స్వదేశీ కాగితములను స్టార్ ఆఫ్ ఇండియా పెన్సిళ్లను, ప్రింటింగు ఇంకులు మావద్దయెల్లప్పుడు స్టాకులో నుండును, వ్యాపారస్తులకు మాపుస్తకములపై వారిపేర్లచ్చొత్తించి యిచ్చెదము. పాఠశాలలనుండి జిల్లాలనుండి వచ్చు ఆర్డరుల జాగ్రత్తగా విచారించెదము. ఉత్తరప్రత్యుత్తరములు ఇంగ్లీషులో జరుపవలెను.

ది డెక్కన్ కమర్షియల్ అండుకో
(మద్రాసు పెన్సిళ్ల ఏజంట్లు
గౌలిగూడ, హైదరాబాదు)

## డొంగ్రేగారి బాలామృతము

ఉపయోగించుట వల
బలహీనతను
పోగొట్టును
బిడ్డలకు బలమునిచ్చి
సౌఖ్యము కలిగించును

ఒక బుడ్డి వెల ౧ రూపాయి
పోస్టు ఖర్చులు ౯ అణాలు
ఎల్ల చోటులందును దొరకును

K. T. DONGRE & Co.
GIRGAUM, BOMBAY

నకలు మందులను చూచి మోసపోకుడు

## అమృతాంజనము

అన్ని నొప్పులకు దివ్యామృతము

ఆసేతుహిమాచలపర్యంతము ఇరువది సంవత్సరములవిఖ్యాతి గాంచినది

నొప్పుల కన్నింటికి వజ్రాయుధము వంటి

గోలకొండ హైదరాబాదు ఏజంట్లు:—

గోవర్ధనదాసు, గోపాలదాసు, వర్తకులు, ఇసామియాబజారు హైదరాబాదు దక్కను.

REG. No. M. 2185

RegNo.M.2185

STAMP

Printed and published by C. Rama krishna Reddy at the Golkonda power Press, Hyderabad Editor K Balakrishna Reddy.